# గిరికుమారుని ప్రేమగీతాలు



విశ్వనాథ సత్యనారాయణ

# గిరికుమారుని ప్రేమ గీతాలు

రచన:

(1920 — 1928)

విశ్వనాథ సత్యనారాయణ

**V. S. N. & SONS,**
**Marutinager, VIJAYAWADA-2.**

౧

అస్మదీయకంఠమునయం దాడుచుండె
నొక యెదోగీతి బయటికి నుబికిరాను
చొచ్చుకొని లోనికిం బోదు ద్రవ్చిపోయె
నాహృదయ మీమహాప్రయత్నమ్మునందు.

విఫలితపునఃపునఃకృతవివిధయత్న
భావితప్రచండబాఘాతధావిదారి
తాస్మదీయహృదంతరంబందుఁ దోఁచె
స్ఫురితసంఫుల్లనవజపాశోణసంధ్య.

ఈమహాసంధ్యలో శారదామయూరి
రమ్యకింకిణీకిణికిణీరభసపాద
మంజులవిలాసనృత్యసామ్రాజ్యలక్ష్మి
యగుచుఁ గచ్ఛపీమృదుగీతు లనుసరించు.

౨

ఈమనోహరవీణ వాయించలేక
చేతనున నెంతు నే నశిక్షితుఁడ నంచు
నాలతాంగివిలోలనేత్రాంచలమునఁ
గదలుచున్నది దానిరాగాల మెరుపు.

ఈవిపంచికమీఁద వాయించుకోర్కి
ఎంత యున్నదో నైష్ఫల్య మంతవఱకు
తెరుముకొనివచ్చె నాహృదంతర మదేలొ
గాఢనిద్రారతుని నన్ను గలతపెట్టు.

అసలు ప్రోగునొ ప్రోగదో ఆవిపంచి
ఏల ప్రోగదు నాదురదృష్ట మనుచు

## 3

ఈజననమరణ ప్రవాహమునయందు నే శరీర
మాత్రముగఁ బోవుచుంటి నామానసంబు
నమితతృష్ణాలసం బంతకంత భూమి
మీఁదినుండి స్వర్గానికి మెట్లు కట్టు.

ఏదో నన్ను వెంటాడెడు నెందుకొరకొ
అగునొ జన్మాంతరమ్ములయందుఁ జేసి
సత్కృతి సంస్కారలేశము ప్రాణములకు
వేచుకొనియున్న యాశయేమొ చివరకు.

౪

నిలుకడ నెఱుంగని వనాంతనిర్ఝరంబు
నీతి నాభావమీశిలాదృతపథంబు
ననుసరించెడు జలజల మనుచుఁ బొంగి
ఒక్క బొట్టైన మిగులదేమో చివరకు.

ఈనిశీథిని నాచిత్త మెంతదూర
మరిగియున్నది తారక లడ్డువఱకు
నవతలే మున్న దని ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్ను జూచి.

౬

ఈమహానందసముజ్జ్వలనము దేల యచ్చ
మైన విసమునె తెమ్మ యీమానిసి యది
క్రోలఁగలఁడు సుమీ కాలకూటవహ్ని
కలిత మఁటవె రత్నాకరగర్భసీను.

ఈభవక్రోధలజ్జారుణేక్షణముల
మొగము నాయది కనవచ్చె ముక్తసంగుఁ
డైననానిబిడబలతరప్రయత్నుఁ డైతి
నైహికాముష్మికముల మధ్యమ్మునందు.

అరుణనృపదాభనిష్కృపాపాంగకిరణ
శమనకౌశితభాషనిర్భిన్నహృదయశకల
ములను గాఢమనఃపాత్రమున నమర్చి
పశ్చిమాశాముఖుండనై పయన మైతి.

౨

ఈలలితసృష్టి యేమొ యీపాలకడలి
యందుఁ గెరటాలు లేవఁట యింక నెంత
వఱకు వేఁగిన హృదయంబునాడెకె గాని
పాలు పొంగవఁటె యెంత భాగ్యులకును.

ఈలలితసృష్టి యేమొ యీపాలకడలి
యందు జలజంతువులు లేవఁటైనఁగాని
పాలు తిండిగఁ బెరిగెడి ప్రాణులైన
నెనుగునో యేమి చిత్రమో యెవ్వఁ డెఱుఁగు.

ఈలలితసృష్టి యెట్టిదో యిందునీదఁ
జాపచెల్లా పరచి నిద్రపట్టకున్నఁ
బట్టినట్టు నటించఁ బొల్పరచునటవె
ప్రథితయోగ్యాంతరంగేశు పద్మనాభు.

౮

మొదటిసారి నాయెడందలో ముల్లు నాటఁ
బడి మహాశూలమునుబోలె బాధపెట్టె
దేహము భరించుటయ కష్టమై హృదంబు
రాశి బాడబవహ్ని పరాక్రమించె.

అదిమొదల లనంతములుగ నిందు దిగఁబడిన
శూలములు ముళ్ళవోలిక సుంత బాధ
పెట్టియంతట శాంతించు వెనుక ముల్లు
కలఁకిడిన నంతగా బాధ కలుగఁబోదు.

ఇఁకఁ గొన్నాళ్ళవునయేని యింతమాత్ర
మైనఁ బాధయుఁ గలుగనియట్లు తోఁచు
నప్పుడు నిశాతబాణము లయినఁగాని
యేఁపయిన యోగ్యమగు నేమొ పదునువెట్ట.

౯

అప్పటికిఁ జిన్నవాఁడ ననంతమైన
యీహృదయశల్యబాధ నే నెఱుఁగ నసలు
తిరుగుచుంటి మధుసరిత్ప్రాంతికల గోనఁ
బారలుచుంటి మొయిళ్ళగుంపులకుఁ బైన.

ఆశిశిరరాత్రమ్మునను నిప్పు డది తలంచ
నే నొకవనాంతరమ్మున నీమలాడు
చప్పు డొకపాట పాడితి నందులోని
యర్థ మిప్పటి నాస్థితి కతికిపోవు.

ఈనిశీథిని నాచిత్త మెంతదూర
మరిగియున్నది తారక లడుగువఱకు
అవత లేమున్న దని ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్ను జూచి.

౧౦

ఇంతలోన వికాసమ్ము లింతలోన
మీలనమ్ము లీ శ్రావణవేళఁ బ్రాగ్ది
శాగగనలంబినీరదచయముతోడ
నామనోవికాసనిమీలనములు వోలుచు.

నికషదృషదగ్రమునఁ దపనీయరేఖ
వలె జలదగర్భవిద్యుల్లతాప్రభల్ గనుఁగొని
నేను స్మరియించుచుంటి విశాలమైన
ప్రణయినీనేత్రముల సితాపాంగరేఖ.

సాంధ్యనృత్యదీశ్వరమురజమ్ము మ్రోల
గర్భఘూర్ణితమంథరగర్జఁ బోలుచు
నీజలదమాల చూచి నాహృదయమందుఁ
బ్రణయమధురగీతమ్ములు బాహిరిల్లు.

౧౧

ఆతఁ డొకవీణ నిచ్చె నాకని సజీవ
మావిపంచికశ్రుతులందు నమృత మున్న
దని నటించిన నాదేహ మమృతఖండ
మది నటించద నాదేహ మవనిధూళి.

నాపురాకృతపాప మేమో పలుకద
యీవిపంచిక నే నెంత యత్రి పొంది
దానితంత్రులు మీటన దానిపైనఁ
బట్టలేనంత కోపము వచ్చి నాకు

శిథిల మైపోవనీ విపంచిక యటంచు
విసరివైచితి దానిఁ బృథ్వీతలాన
నపుడు తెలిసెను నాయాత్మయందు దాని
తీవ్రఘాతమ్ము వచ్చి ప్రతిధ్వనించె.

౧౨

ఈ కలన శరత్పూర్ణిమామృతశశాంక
లలితజ్యోత్స్నావితాన మా కలన ఘోర
ఘనతరాంధకారచ్ఛటాక్రాంతభూమి
అందు సగ మిందు సగ ముంటి నవ్వు నేను.

ఈశరత్పూర్ణిమాచంద్రికాసుధాము
కేదిలో నున్న నేను స్వాభిభవన్న
ఏవశంపాలతాకృతి వ్రాసియుంటి
ఈసగము నాకు నాకె కన్పించబోదు.

ఉగ్రరాహుచంద్రార్ధబింబగ్రసనము
పోలె నున్నది నాస్థితి.

౧౩

స్నేహపూరితమై నా చిన్నప్రమిద
లోన కాంతి యుత్పన్నించి వెలుంగ లేక
వర్తి యతిపుష్టిమత్తైన పైడిప్రత్తి
అస్మదీయ మహాభక్తి యపరిమితము.

ఈప్రదీపికా కాంతి దిగిభసమూహా
గండఫలకంబులం దలంకారచిత్ర
వల్లులై వెల్గు నని లోన బ్రమసిపోతి
నకట! దీపిక మొదల నంటుకొనదాయె

అంటుకొనె నేని యీదీప మతిశయితర
సాతలోత్ఫుల్లఫణిఫణాచ్ఛవివినూత్న
ఘనచలద్రత్న మగుచు శిఖావితాన
కాంతిచయమున నూర్ధ్వలోకములు ముట్టు.

౧౪

అమృతమూర్తి ప్రేయసీవదనాంచలమున
మందహాసోదయం బగుమాడ్కి నాకు
చిన్నిపూదోటలో గూడ జివురులెత్తె
నీవసంతప్రభావమ్ము నేమి చెప్ప

ఈపువుందీవబోదెలో నిల్చి ముడుచు
కొని భుజగమునై నిమురవో గోర్కె గలదు
ఓలి సొగసు నాప్రియురాలివోలె నిప్డు
సూనవనలత నాకు శుశ్రూష చేయు.

౧౫

ఇది మహాగీతిప్రారంభమవు నాయుత్కంఠ
ముడిచిపోయెను నాలుక పిడచకట్టి
నిమ్మనాకంపపత్రతిరోగాలము లున్న
హిమచలివేంద్రంగా వచ్చి నిలచినాను.

ఒడ్డు లురలిన యమృత మోహాలో! ఆరోగ్య
వితానకీగమ్ముపై బ్రవాహించినావు
శుభపవిత్రరూప జీవవాహినియ యన్మ
నాఘటము కాలశిఖరభిన్న మగుదాక.

అట నదృశ్యమ్మయగు ప్రవాహమ్ముచోటఁ
బోలములై భావిసమయలాంగలము తగిలి
యాఘటవిభిన్నశకలము లేమిభావ
ములు కృషీవలుహృదయసంకులము లగునొ.

౧౬

ఈవిలాసాధికజ్యోత్స్న మొండ నుండి
పనలు తొలిసంజ రేకలు పర్వినంత
మధురసీమంతినీచారుమందహాస
వాసనలు చిమ్ము వెన్నెలల్ గాసె బళిర.

చూచుచుండ విలాసపుచూపు లొదవెఁ
గన్నుగవచిట్టచివరి భాగములయందు
సాంధ్యశీతలమైన యీచల్లగాలి
ముద్దుటిల్లాలినర్మోక్తి ముచ్చరించు.

కిసు విలాస మీవెన్నెలకాల్వయందుఁ
దేలియాడు తరంగవీధికల నడుమ
నాప్రణయభావరాజహంసీప్రయాణ
మమృతమాధుర్యపుంద్రోవ లంటి నడచు.

౧౭

చరమశీతలమగు దివాచ్ఛాయలందు
నీనడక కొంచెముగ స్పష్టమైనయదియ
ప్రణయసూనపరీమళవ్యాప్తదేహ
కృతకుతూహలులము పులకితుల మేము.

స్రుతదినాంతసంధ్యావటల్లోకనాథ
చరణజనితరావమ్ములు గిఱులుకొన్న
నీయురములోనఁ గలసి ధ్వనించుచుండె
మాహృదంతరమ్ములు నీలమసృణమూర్తి.

ప్రణయినీనీలనీరజాభముల కనుల
కాటుకయుఁబోలె గగనమ్ము క్రమ్మియున్న
నీగొడుగునీడల నొదిగి నిలచినాము
శైత్యముగ్ధప్రభూ! నవాషాఢజలద!

౧౮

ఆజగదకీత తేజో విరాజమాన
మైన నేత్రాంతరమ్ముల నరసి యరసి
కొన్ని జన్మంబులకు మున్న నన్ను నేన
చూచుకొంటిఁ దత్సందయోగశుద్ధశీలు.

ఆ ప్రణయదివ్యశయ్యపై నవధరించు
నంగనాథుఁడ నూహకురాని సుఖము
లేమొ యని చూచుఁగోనఁ ద్రపామధురిమఁ
గలఁగి చూపు నైశ్చల్యంబు గలఁచివైచె.

౧౯

ఏ శోకసమీరాహతి బాలుఁడ వీప్రసవము
నాకు సమభాగినిగఁ గూర్చినాఁ డతఁడు
మాపరస్పరమ్మును స్పర్శమాత్రముచేత
పులకితబ్రహ్మపథమునఁ బోవఁగలము.

ఈయనంతపథమ్మున నెంతదూర
మరుగుదుమొ మాకె తెలియని దది, తలంపు
నందఁగారాని కడల సంధ్యాసమయపు
టరుణరోచులలోన వాహ్యాళి మాకు.

ప్రాగుదితచంద్రబింబముపైనఁ దరక
కట్టినటులున్న క్రొత్తమేఘంపుతునుక
మమ్ము రమ్మనుచున్నది మాటిమాటి
కచ్చటికి మేము నేడు ప్రయాణ మగుట.

౨౦

నేను పసివాఁడ నప్పుడు నిత్యబాల
లీలకొఱకు నొక్క గులాబిపూలమొక్క
నాకుఁ జూపించి యిది నీది నాయనా! య
టంచు నాయేఁడు పుడిపె మాయమ్మ గిద్ది.

అరయ మొద లాగులాబి మొక్కన్న నాకు
నాది యనుభావ మేలనో నాటుకొనియె
నలదిగంతినుంచలి నునుదంకురములఁ
బిలుచుకొనివచ్చి దానికి ఁ బేఁచఁ జేతు.

ఆమొలకగూడ దైనందినాభివృద్ధి
పొంది యొకనాఁటిప్రొద్దునఁ బూవు పూచె
అందులోని తుషారమ్ము లమృతధునులఁ
టనియె మాయమ్మ తన కది యాయు నంట.

౨౨

అలసి యీనిర్ఝరతటంబునందు నేను
విశ్రమించితి వనదేవతాశ్రమమున
నామె యాతిథ్య మొసఁగి నా కమృతమైన
యీప్రసవ మిచ్చి నన్ను రక్షించు మనియె.

అది యనుభవింతునా వలదా యటన్న
సంశయకృశానుకీలల సమసిపోయి
దృఢవినిశ్చయచ్యుతుఁడ నాకిన్యసుమము
వాసనలు చూడనే చూడఁబడియె ననుము.

అది మొదల యీప్రసూన మంతింత వాడి
నత్తలై పోవుచున్నది వనరమ యరు
దెంచి పూవునుగూర్చి ప్రశ్నించు నేని
యే మని వచింపవలయునో యెఱుఁగరాదు.

ఇస్థానమును బ్రయాణమై వేగిపోగ
చంద్రబింబమ్ములోఁ జొచ్చి చనుచు నుండ
నొకవిపన్నులవిఛ్ఛిన్నోజ్జ్వలాంబు
నిచయపూరమ్ములందు మున్గితిమి పోయి.

ఆర్యులెవరి యొందుఁ బుట్టెనో యని నొచటికిఁ
బోవునో యని సంశయంబులు ఘటిల్లి
యిద్దరము నిలువంకల నేగినాము
ఎంత యేగినఁ దుద గానిపించ లేదు.

పోవుచుండ నే నొకనీటిబొట్టు నయితి
ఆపయినఁ గొన్నినాళ్ళకు నంబుకణ మొ
కండు ననుఁ జూచి 'నదిమొదల్ కానిపించ
లే' దని వచించె నది పట్టలేదు నాకు.

౨౪

ఒకవిచిత్రమ్మయిన స్వప్నకథ నీకుఁ
జెప్పెదన అది ప్రళయనిశీథమంట
పొంగిపోయి సముద్రాలు భూమియెల్ల
బుసబుసని నుర్వులో మునిగిపోయెనంట.

నాల్గుదిబ్బలు మిగిలియున్నవఁట యందు
నల్వురము నీవు నేనును నాజనకుఁడు
నాసఖుఁ డొకండు నిలిచియున్నామఁట ప్రళ
యాతిభీకరమఁట గగనాంగణంబు.

ఇంతలోఁ జూడ మిగిలినా మీవు నేను
నిఖిలవర్ణాతిభీకరస్నిగ్ధములగు
ప్రళయమేఘకాంతులను గన్పడియు నీవు
కన్పడవు తుద కేన యొక్కఁడ మిగిలితి.

అమృతనిభృతమ్ములైన నీయశ్రులందు
నఖిలవిశ్వము నవ్య! నా కగపడునటు
ఈవిశాలమ్మయిన నీయావిలోచ
నములలోనఁ బ్రతిఫలించె నాహృదయము.

ఈమహావిశ్వముఁ బ్రతిఫలింపఁజాలు
మన యనంతత్వగర్భితమగు భావ
ధునికి జన్మస్థలంబు నాతనువు నిదియు
నాజననిగర్భమున కల్పమై జనించె.

అస్మదాదికరేణుసహస్రములను
దనమహాగర్భమునయందుఁ దాల్చియున్న
ఆయమ యనంతమూర్తి నా కనవగతము

క్షపణీయపయోరాశి మథించినారు
ఆ కవ్వపుగిరి నున స్నహిపతిగను
తరచితరచి బలమ్ములెల్లఁ దరిగిపోయె
తరచి తరచి భుజమ్ములు విరిగిపోయె.

ఆపయోరాశిలోఁ బ్రళయకాలాతిభీక
రముగ విషవహ్నిహాలాహలము సముద్భ
వించె నది యోర్పుగలిగి దేవిగళమ్ము
నందు నిలిపితి నేను జ్ఞానాకృతి నయి.

అది గళమ్మున నిలిపినయపుడె నీవు
నేను నొకటైతిమే పురంధ్రి! శశికళ
పొందరిశిశిరముగ్ధసుధారసస్రవంతి
మనశిరస్సులఁ దాండవించెనె లతాంగి!

౧౭

ఏ నౌకాప్రవాహగామిని యీడ్చి యీడ్చి
మొదలు తుదలేని యీమహాంభోధియందు
నౌకసముచ్ఛ్రితశైలతుంగోర్మివలన
నీయుదారతీరమునకుఁ ద్రోయఁబడితి.

దివ్యజంబూనికుంజప్రతిహతరయము
లగు ధునీమతల్లీతరంగాశ్వాసితము
లైన యీభూమిఖండములందు నీవు
నాకుఁ గన్పించితి సుధాసైకమూర్తి

మఱల నీదఁగఁబోయిన మనలఁ జూచి
శరధి శాంతతరంగమై స్వచ్ఛహార
శిఖరడిండీరసౌధసుస్థితిని జేర్చి
లాలనము చేసెఁ బౌత్రుబాలలవిధాన.

ఇచట నొక పెద్దయంబుధి యచట నొక్క
పెద్దయంబుధి యీమధ్యఁ బృథ్వీమార్గ
మది ద్వీపార్శ్వంబులందుఁ దారాధ్వనికష
శిఖరములు వృక్షతతిచేత శీతలంబు.

ఆపథమ్మున నీవు నే నరుగుచుంటి
మస్మదీయాననాబ్జంబు లమృతమధుర
ముగ్ధవిస్మితములచే ముఖరితములు
పక్ష ముత్సుగమ్యమయ్యె నీపరమకరుణ.

ప్రాగ్దిశాయాతమృదుమందపవనధూత
మైన యీతరుపుష్పంబు లంజలి గొని
సాచినన్యస్మితాకృతి వేచియుండె
నమృతధుని యపాంనిధి మన యాగమనము.

## ౨౯

నే నొకప్రసూనమాలఁ బూనితిని జేత
నాప్రియసుమంబునందు నే నవఘళింతు
గ్రథితములు నిందు వరుసగా తోరకములు
కోరకములు కుట్మలములు కుసుమములును.

మొదటిమొగ్గలు నీకృపాముగ్ధదృగ్గ
భస్తి నెఱుఁగమి వికసించి పరిమళించ
నచటివి భవత్కృపాలోకనాశ చేత
నర్ధవికసితమ్ములు తుహినాంశువదన!

ఈ చివరగ్రుచ్చఁబడిన పూలెల్ల విరిసి
నీవదనచంద్రమండలనిస్రుతామృ
తాభిషేచనమునఁ జేసి యాశలందు
ధృతమధుస్రుతిఁ దేంట్ల కాతిథ్య మిచ్చు.

౩౦

ఈమహావకాశమ్మున కిచట నేను
అచట నీవును నిలచి మోహనదృగంత
మాలిక పరిసారమున నీమధ్య నున్న
సీమ పుష్పమయమ్ముగాఁ జేసినాము.

ఒకరి నొకరము కలసికో నురికి యీ ప్ర
సూనపూర్ణావకాశమ్ములోనఁ జొరఁగ
నిర్వహింపను బుష్పాకృతు లెనసి లుప్త
భిన్నరూపులమై విడంబించినాము.

తెలిమొగిలుగుంపులోని నిగ్గులవితాన
విరిసిన యచంద్రచంద్రికావిమలరోచు
లొలసి మనపైన నొక్కరి నొకరిలోన
నిపవనచంద్రికలు గ్రుచ్చి యెత్తుచుండె.

౨౧

తూర్ణ్ణికనుమల వహన చంద్రమునకు దాక
శిఖరములచాలులో సుధాసిక్త మహోర్వ్య
నాకశీర్షమ్ము సిక్త మైనది భృశమ్ము
అస్మదారోహణావరోహణములందు.

అనంత వేగాన గిర్యుపత్యకము తెల్లఁ
గడచిపోవుచు శిఖరశేఖరములందు
శశికిరణమంజులస్పర్శచేత సొలసి
యమృతమూర్తిని దన్మయత్వము భజింతు.

ఇన్ని శిఖరంబులందున నేగి యేగి
యీమహాస్పర్శసుఖ మేలొ యెఱుఁగలేన
ఉన్నతోన్నత మీశిఖరోజ్జ్వలాగ్రి
సీమ శశిలోన నీవు తోఁచితివి నాకు.

౩౨

సూర్యుఁడను నేను ప్రాగ్దిశాసుందరీము
ఖారవిందసుందరతిలకాకృతి నయి
యుదయ మందితి నాకోస మెదురు చూచె
విడిలు రేకల నీప్రొద్దుపొడుపుపూవు.

ఓదయా స్తనగంబు స్వీయోజ్జ్వలితపి
శంగవర్ణసుందరదళచ్ఛవులచేత
నా మెయును ముగ్ధశిశిరకరాలి నేను
ఒకరి నొక్కర మనుసరించుకొనినాము.

మాపరస్పరాలోకనమధురదీర్ఘ
నిమ్నసుందరాపాంగసూత్రములచేత
ననిలపథములఁ దేజోమయమ్ము లైన
ముళ్ళు పడెఁ బృథివ్యాకాశములకు నేఁడు.

33

ఈసుధార్ద్రశాఖాంచి యేచు కలసి
కొన్న యీయెడ గుఱు తిడికొన్నఁగాని
ఆపయిన నేన ప్రవహింతు నధికమూర్తి
నామె యే మాయెనో తెలియంగరాదు.

వేగ పూగి శాంతమ్ముగా నేగుచుండ
నేను శారదస్వచ్ఛవిజ్ఞానమూర్తి
నామె నాయట్టియడుగున నణఁగియుండఁ
బోలు చిక్కణశ్యామజంబాలమూర్తి.

జలనిధిప్రాంత మద్ది పార్శ్వములయందు
బంగరుంబచ్చకం కెలు వదలి సొగసు
చాలుకట్టిన యీరాజనాలపైరు
నందు నామె ముమ్మూర్తుల నవఘళించు.

౩౮

ఈనవవసంతసమయ మి ట్లేఁగుదెంచి
చిఱుతపువ్వుఁదోఁటలెల్ల లఁ దిరుగు ప్రణయ
ముగ్ధమూర్తిని మత్పదాంభోజములను
వికసితసుమాతిథేయ మర్పించెఁ జూడు.

యుగయుగాల వసంతపుటూఊపు లెల్ల
దాచికొని భావిమధుసౌందర్యచిహ్న
గర్భితమ్మైన యీసుమకాండము లివి
దివ్యయౌవనవతులట్లు తేజరిల్లు.

ఆతిథేయమ్ముగా లబ్ధమైన యీసు
మప్రకాండమ్ము సమకూర్చి మాలఁ గ్రుచ్చి
ఇది భవత్కంఠసీమ నర్పించినాను
నీవు ధ్రువమండలంబున నిలచినావు.

౩౫

నీ నిజస్వరూపమ్ము ధ్యానింప నెంచి
విశ్వవస్త్వంతరమ్ముల వెదకి వెదకి
కొసకు నా హృదయాంతఃకోటరస్థ
మైన సూక్ష్మాకృతిని నిన్ను నే నెఱిఁగితి.

నేను ప్రాపంచికముగ ననేకకార్య
లగ్న హృదయుండఁబోలె నెల్లరకుఁ గానఁ
బడుదునే కాని దేవి! నా భావ మెప్పుడు
నిత్యలగ్నంబు నీపాదనీరజముల.

౩౬

నీవియోగ మ్మటంచు నే నిక్కువముగ
నెఱుఁగనే మఱుంగను నాదుహృదయసీమ
నీ వకృత్రిమభావనానిశ్చితాత్మ
వెల్లపుడు మూర్తి కట్టితివే యటనుము.

ఇది యెచటనుండి వచ్చిన దీవియోగ
వహ్ని యెచటి దీసంయోగభావశాంతి
దేవి! నీగీతములు పాడి దివ్యమైన
నీదుసంయోగసుఖవార్ధి నీదుచుంటి.

ఎపుడు నీపాట లే నాలపించలేనో
రవులుకొనును నాదుహృదంతరమునయందు
నీవియోగాగ్ని యపుడు.

32

ఈపవిత్రకార్తికసంధ్యాప్రసవముల
పోలయు జంతాతపములఁ గృత్తోపవాస
కార్శ్యమునఁ దూలిపోయి నాకాళ్ళు సాంధ్య
నృత్యాదీశ్వరు నివి తలపించు నెఱులు.

ఈపవిత్రసంధ్యాకాలనృతనవాను
గాంశువులు శశక్షతజరమ్యములు నాదు
మేనఁ జందనమునుబోలె మెత్తఁబడియెఁ
గనులు నాయవి నిప్పుకల్ గ్రక్కఁదొడఁగె.

భవమహాపూజఁ దన్మయభావమందు
నాపయిన నీకటాక్షసంతానలహరి
ఇంతి! నీవు దోసిళ్ళతో నెత్తిపోయ
శివశిరఃప్రదేశకృతాభిషేక మయ్యె.

ఈయుషఃకాలశీతవాతోర్మి లేచి
కృష్ణవేణ్ణాసరిత్కుల్యఁ గృతనిమజ్జ
నాతిధౌతశరీరులమై శివార్చ
నోపవాసవ్రతం బూని యుండి మనము.

భుక్తపూర్వాహ్ణవేళకుఁ బోయి భక్తి
మోసులెత్తఁగ నాసంధ్యముగఁ బొనర్చి
నట్టి శైవమహాభిషేకావసాన
మునను గర్పూరహారతి పూనినాము.

ఆమహాఖండహారతియందు దీప్త
మైన యిలువేల్పు విశ్వేశ్వరాచ్ఛలింగ
మందుఁ బ్రతిఫలించిన మనయాకృతు లివి
అర్ధనారీశ్వరభ్రాంతి నావహించు.

పాటీరసృతవిన్యాసవిసరజమృదుతర
గాత్రతనువల్లి నిండఁ జందన మలంది
మద్భుజాశ్లేషితాంకసంవలితము గ
ళమ్ము కాలాగురుకళంకితమ్ము చేసి.

కమ్రకస్తూరికాతిలకమ్ము దిద్ది
ఫాలసీమ, బంగరుచంద్రవంక పొదిపి
దీర్ఘ రమ్యసీమంతవీధికఁ గనులను
గృప విభూతిరేఖలను దీర్ఘీకరించి.

నీయెదుట నిల్చి నిన్ను ధ్యానించుచుండ
మార్గశీర్షపు భూధ్రపరిమాణమైన
మంచు ముత్తెనూవల్లికాంచలముల
మసలుచున్నదిసూవె సంబంధివోలె.

౪౦

ఈనిభృతపవిత్రైకాదశీనిశాపవి
త్రాంతశ్రీకాలనాథపూజాసమయము
లందు ముఖమండపమునందు నందజీవలె
నాప్రదీపము వెలిగించినాను నేను.

ఇవియుఁ జెంగల్వమొగ్గలో శివకషాయ
పులకితజటాగ్రశేఖరమ్ములో ప్రదీపి
కలు శివాలయముఖగృహాజ్వలితములయి
దివ్యతారక లన్న భ్రాంతి కలిపించు.

అస్మదీయప్రదీపికాభ్యంతరమున
ప్రజ్వలితమైనయది పరబ్రహ్మదీప్తి
దేవి! తావకకరుణాప్రదీప్తివలన
నీసమాగతేతరజను లెఱుకలేక.

౪౧

నీవయినఁ బాడినట్టి నావిభృతగీతి
పాడుటయె పరమార్థ మాపైన దేవి
అందుఁ బ్రత్యుత్తరమ్ము నీమందహాస
బాలచంద్రాతపములలోఁ బ్రజ్వలించు.

బాలకులు మూగి వెన్నెలవత్తికొఱకు
శ్లక్ష్ణవృష్టులు వెనుకాడుచందమునను
ముగ్ధహృదయులు నామిత్రులు మదీయ
గీతికార్థమ్ములకు వెదకెదరు దేవి!

# రతి

అల్పబుద్ధు లజ్ఞాతదివ్యాస్మదీయ
భావ లీనురదృష్టదేవతలు వచ్చి
ముగ్ధహృదయుండనైన నన్ మోసగించి
నాహృదయగీతి లాగుకొన్నారు దేవి!

విమలమృదుగీతివైఖరుల్ విస్మరించి
విస్మరించిన దిగులుతో వేనురునయి
మత్పురాగీతికాంచలమార్గములను
దిరుగుచుంటి నున్మత్తునికరణి నేను.

౮3

భవదనంతభావములఁ ద్రిభాగశేష
మైన యీదీర్ఘ హేమంతయామినులను
గలతనిద్దురలో స్వప్నకలనచేత
నిను సాక్షాత్కరించుచుంటివి లతాంగి.

పృథివి యంతయు నీపాదపీఠముగను
నలవరించి యనంతాకాశ మావరించి
అనిలవీచికా స్తంభన మాచరించు
నిన్ను సేవించుచుందు రగ్నివరుణులు.

౨౨

ఈగవాక్షంబుచుండి నాపైఁ గవిసిన
పీయుషారేఖ లివియు మత్ప్రేయసీప్ర
భాతవేళాశిశిరముగ్ధపంకజాత
మృదుకరస్పర్శవోలె నన్ మేలుకొల్పు.

మీలితాక్షుఁడనై సెజ్జ మెదలుచుండఁ
దెలివిపొలముల సొగసు లెల్లలకుఁ దగిలి
నామనసు నేదో యొక్కయజ్ఞాతపూర్వ
మైన యనుభూతి కలిగె నాయంతరాత్మ.

అనిమేషార్ధమున భాసమయ్యె నాకు
గతవిభావరీసుఖదుఃఖఘటన లెల్ల
స్వాప్నికము లని సత్ప్రకాశమున నింకఁ
బోదు నని పులుగడిగిన ముత్తెములు.

౭౨

ఈప్రణయగీతి చిత్రమే యేరితోడ
నైన నే నుండ నగ్గ కేని రాదు
నాకు నేకాంతమునయందు నన్ను మరుగఁ
జేసినది హావభావసుశ్రీలచేత.

అనుభవగీతి నేను నేకాంతగోష్ఠి
నున్నయప్పుడు నీవు రా నొక్కయింత
కొంక వానీతిసతి తప్పికోమలాత్మ
అది మనము నర్మగోష్ఠి నున్నపుడు రాదు.

౪౬

అమృతతీర్థంబునం గ్రుంకులాడఁ బోయి
యీదనుక దేవి నీవు రాలేదుచూవె
నీకయి శశాంకమృదుయామినీపసీమ
శానిలములలోఁ జూచుచున్నాను నేను.

రంజితాధగతాంబూలరక్తిమంబు
చిఱునగవుతెల్లదనములోఁ జిటిలిపోవ
నెదురుగాఁ దోఁచి నాకు నందిచ్చినావు
చిన్నిశిశువునుబలె తీర్థసేవఫలము.

అరయ నందీశ్వరుని యీషదంకురితవి
షాణయుగరమ్యమూర్ధదేశంబువోలె
హైమజలదంబుకొసలఁ గోరాడుచుండి
చల్లనయ్యె మాయెడల నీచంద్రరేఖ.

౪౮

ఏడెనిమిదేండ్ల కూఁకటు తెమగరాని
కుఱ్ఱవోలిక భావముగ్ధుఁడను నేను
ఎప్పుడేని సముగ్ధుఁడనేని యితర
జనుల సంఘర్షణప్రతిచ్ఛాయ లవియు.

కాదయేని చేమంతి ఆఘ్రాణయోగ్య
వైన నిన్నుఁ జుంబింతునేలా! విలాస
మొలుకు నినుఁ జూచి యానంద మొందలేక
చెలువురెక్కల విడిలఁదీసెద ని దేల.

౭౮

నీ వసంత భావాలయమై విశాల
భావసామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీకృప న దెంత భావమేనియును సుపరి
చితమయట్టులఁ దోఁచు నాచిత్తవీధి.

ఈప్రణయభావగీతము లివియు నీకృ
పాతిశయమునఁ బూవులేనట్టిచోటఁ
దావియును గ్రొమ్మొగిలులేని తావునందు
శైశిరపృషత్పరంపరల్ సంతరించు.

౮౫

శ్రీదమై శాంతమై సమీచీనమైన
యవ్యయపదంబునందు సింహాసనమున
నీ వధిష్ఠాత్రి వేలుచున్నావు కమల
పవనములు వీచు నీపదాబ్జములనుండి.

అకట! కామాంధులైన యీయాత్రికవ్రా
తములు వచ్చినవే వచ్చుదారి కడ్డ
మిన్ని దినములుగాఁ బ్రయాణించుచుండి
యవ్యయపదంబు పొలిమేరలైనఁ గనక.

౫౦

ఇవి మహామోహప్రారంభము లిచటనుండి
వివిధకష్టంబులు ననుభవించినాఁడ
అచట ముక్తిఫలాలు నం దెచటఁ జూచి
నను సుఖాలె పరిమళించినవి భృశమ్ము

ఎంతయెంతకష్టమ్ములకేని మొగ్గి
ఎన్నిమోహాలనైన జయించినాఁడఁ
బూర్ణయత్నమ్ము చేసి యీముక్తిఫలము
గట్లునైతమ్ము కొంచెము గనుముకొంటి.

ఇరులు గ్రమ్మ నిప్ప్రొద్దున మఱలఁ జూడ
గడుచుకొన్న ముక్తిఫలాలు వదలిపెట్టి
గెలుచుకొన్న మోహాల నేలలకు వంగి
అకట! సాలోచనాత్ముఁడ నైతి నిట్లు.

అతివ! యీకుంప మీఁది నిత్యాగ్నిహోత్రి
నైన నాదుకర్మిష్ఠితకగు సహాయ
పడెద వేహాగ పోయి నాపలితనేత్రి
కోణములు జ్యోతులై వెలుంగు గృహలక్ష్మి!

వచ్చిన వసంతమల్లి కాపుసవదామ
ములను మంచిగంధ మ్మంజలుల ఘటించి
ఆహుతిగఁ జేసితిన యిష్మహాగ్ని యందు.



కనుగొనినవారు నను వసంతుని సుమాస్త్రు
గుఱిచి యజ్ఞదీక్షితుఁ డనుకొనిరి గాని
నేస్తురాలవు నీవ యగ్ని సమకూర్ప
నగు నిజానికి కర్మిష్ఠి నని యెఱుఁగరు.

౫౧

పగలె రాతిరివలె తమోభయద మయ్యె
గగనభాగగర్జితమేఘఘటలవలనఁ
గురియుచున్న వర్ష మ్మిరి కురియుచుండె
నేగుచున్న నే నిట్టుల యేగుచుంటి.

పటపట నెగుల్చుకొని నేలపైకి దుమికె
నేను యామిన్ను లచ్చోట నీశరీర
ముత్పులక మయ్యె నే నుఱ కూహ సేతు
పిడుగ దె ల్లుండు నాపైనఁ బడునయేని.

ఆర్ద్రవసనాంతపిహితోత్తమాంగుఁడైన
యేను నభిసారికంబలె నేగుచుంటి
నాచను పరిశ్తపథ మెచ్చటో

ఈవిలయమాతవర్ష పాతావసరము
ప్రాక్ప్రకార్యాంతరాదిష్టమును సుశిక్ష
మైన మనజీవితంబునయందు సంది
యములు కలిగింపఁబడుచుండె నమృతమూర్తి.

ఈవిలయవాతవర్ష పాతావసరము
నందు మనపురాకల్పితమైన ప్రణయ
సౌధ మట్టిట్టు కదలి భూస్థలిఁ బ్రపాత
మగునొ యనుసందియమ్ము న న్నావరించు.

ఇతఁడు విలయాధినేత కాఁడే శశాంక
మౌళి యీదేవదేవుదివ్యాలయమున
నాందిపీఠముకడ భావనాప్రకల్పి
తాస్మదుభయమూర్తిగ సమర్చాత్ముఁడైతి.

౫౪

ఈపయోధితరంగమ్ము లింతవఱకు
పరువులై వచ్చి యొడ్డున విరిగిపోవు
ఈయనంతనైల్యమ్ము తా నిచట నిచట
తెల్లని కెరళ్ళలో వచ్చి తేలిపోవు.

ఈయనంతశూన్యమును నైల్యించె నెవఁడు
ఆమహానైల్యమును దిగంతావృతమయి
ముంచుకొను వార్ధిఁ బ్రతిఫలింపించె నెవఁడు
నన్ను నీవార్ధితటి నిల్పినాఁ డెవండు.

ఈయాతనైల్యమ్ము నాయాశలేన
మామ వ్యాపించె నాజన్మమాది

౨౨

సుకసుమ ఫాలమునందు వ్రాసికొని మొదను
సృష్టిలో వాటికి వసంతము సుమనోజ్ఞ
మైనఁ గానిమ్ము నాకు నీ నన్న మేను
జలదరించుచు ఓయి! ఆషాఢజలద!

నిను మదీయగిరాంవీథి నిలిపి శైవ
సాంధ్యతాండవనూపురస్వనము లొలుకఁ
జేసితిని నీవు మింటికి క్షితికి నేను
కవుల మైతిమి హృదయదుఃఖములు పాడ.

నీవు జగమునఁ జీకట్లు నిండఁజేయ
వెలుఁగు చొరని యింటిమూలలకుఁ బ్రాకి
ముసుఁగుమప్పటిలోఁ గన్ను మూఁతవెట్టి
పొదలు పెనుచీఁకటిని శాంతి వెదకికొందు.

౫౬

ఇది ప్రసవజన్మ మెత్తిన దిదియ చాలు
నన్ను నవహైమనిగళబంధములచేతఁ
దనయెడకు లాగికొనఁ బల్మిత్రాళ్లఁ గూడ
నేటికో నన్ను బంధించ నింత తివురు.

ఇది యొకఁడె బంధ మని మది నెంచికొంటిఁ
గాని యీరెమ్మ యీకొమ్మ దీనిచివర
పొలుచు చివురులు పిందెలుపో యివెల్ల
నన్ను లాగఁ జూచెడిని బంధములు వేసి.

నిక్కముగ ననతిక్రమణీయమైన
దైవమును నూర్ణనాభికృతమగు చెట్ట
వాగురఁ దగుల్కొని కృతమహాగసుఁడను
వెలికి లోనికిఁ గాక తపించుచుంటి.

౫౭

అసలు నదిసంద్రమందు గేహంబు కట్టి
యాతుపానుల గని భీతి యేల పొంద
ఒక్కవేళ యీవార్నిధి యుబికివచ్చి
నన్ను ముంచునే యని యనుకొన్న నేమి.

నాగృహము గుర్తుగానున్న నావికులకుఁ
దొలుతరోజుల మనసులోఁ గలకెగాని
ఈమహావార్ధి కడియు తుదా మొదల గ
ణించుకో నొందు రెంపు కన్నీటిబొట్లు.

ఇపుడు బిట్టుగ రేగెడు నీతుపాను
క్రమముగాఁ దగ్గిపోవును కాక యేమి
చేయఁగల దూరికే పొంగి శిశిరమైన
కెరటములమీఁద నన్ను నూగించు నేమి!

# శిల

ఎట్టయెదురుగఁ దోఁచెను కొట్టవచ్చి
నట్లు కోసిన కొండకొమ్మనఁగ నీశ
రత్నమయకించిదసితనీరదము వాయు
పథముకడఁ దాఁకి తారకాపథము మిగిలి.

కాన్గుకొమ్మల కోనఁ జీఁకటులు ముదిరి
ముడులుపడి నేలపై రాలి పడినయట్లు
నీలచిక్కణములు చల్లనిడ పోలసె
మఱుల నిట విశ్రమింపఁగ మనసు పుట్టు.

పొద వెలికి వచ్చినట్టి లో నిదురవోవు
శ్వాపదముకాలిగోరు నా వరలు మొయిలు
చాటుబడి యర్ధవిస్పష్టచంద్రరేఖ
నామెద సమాశ్రయించు పునారికంస.

౬౭

ఈవిశాలము నందనోపేత సుమృత
దంబు సుఖనిధి స్వర్గఖండంబు దీని
మృదుహృదయమందు నేను నిర్మించుకొంటిఁ
గను నవిన్యవస్తువుల సంఘటనపరచి.

ఈమయానిర్మితస్వర్గసీమయందు
నిఖిలవర్ణసుందరతరస్నిగ్ధమైన
హరిధనుఃఖండ ముదయించె నాధనుష్షు
చివరలుచు వానజల్లులచేతఁ గరగె.

నాస్వాదుత్తమక్షేత్రసంతతులు రాజ
నాలు పండెను తొలివిత్తనాలు పండె.

౭౦

మనసిచాహాని కచ్చువోసినదిసూవె
సకియ ముగ్ధవిస్రబ్ధ యీఁజన్మియావు
వియతభావుఁడనై యొడల్ విమురఁబోన
నాయొడలు నాల్కతుద చాచి నాకఁజొచ్చె.

తరచి గిలకొట్టరాదును దరకమీఁగ
డలును చిగ్రుపలై వెన్నయు వెలలరాదు
సుప్రసన్ననిత్యము లామెచూపు లట్లు
వికృతిరహితమే తత్ప్రకల్పితపయస్సు.

ఉజ్ఝితాఘదివ్యమ్ములౌ నుభయసంధ్య
లను బరస్పరసేవావిలాసనేత్ర
లగు భవత్సితాపాంగపయఃప్రవాహ
వీచికాసుఖస్తిమితవిలోచనుఁడను.

౬౧

కృత్తమహింసనితిప్రదోన్మత్తమస్త
విహితమై యపృగ్లాహాభిపిహితమైవ
లె శివబార్యాపదమ్ములు మసృణమయ్యె
మనమొసఁగు పూజాకుంకుమమ్మువలన.

ఒడ్డిగిలఁబెట్టి కొడితీసి యుజ్జ్వలింపఁ
జేసిన ప్రదీపికాకాంతిఁ జీఁకటులును
పలుపలై కపురారతివెలుఁగులోనఁ
బొదలె జ్యోతిస్సులన దేవిపదనఖములు.

ఈశరద్రాత్రి శైలకన్యాసుహాస
రంజితాత్మలము శివశిరస్సుమీఁద
సగము నిండిన చిన్నారిచందమామ
మొగిలుచాటున వెన్నెల మూసబోసె.

౭౨

౧

వానకోయిలనై నేఁ బిపాసఁ దగిలి
వృతవినీలాబ్దమున నొక్క ఱెక్క విచ్చి
ఎండ పలుచనిపొర నొక్కయెఱక చాచి
పైకిఁ జూచుచునుంటి నీరాక వేచి.

అతికృశీభూతమగు దేహయష్టితోడ
శారదాచ్ఛనీరదముక్తజలకణంబ
నైన నీ వేగుదెంచి నన్నంటినావు
లేమ ! నీ వంటినట్టులే లేదు నాకు.

శిశిరమధుమాసములు గతించి కృషికులు హా
లాలు దున్నిన నాఁగేఁటిచాలులందు
ఱెక్కలను జాచుకొని నీటిచుక్కనైన
నీమృదుస్పర్శలో మేను నించుకొందు.

ఈ చిఱుతముత్తియమును చూచి యెల్లవారు
ఏ మహావారిరాశిలో నిది దొరకెను
ఏ మహాశుక్తిగర్భాన నిది జనించె
నని మహాశ్చర్యచేతస్కు లైరి దేవి!

శుక్తిగర్భమ్ము చేసిన సుకృత మేమొ
దివ్యరత్నపరీక్షకుల్ తేరి చూచి
ఇది మహాద్భుత మనిరి యేద్వీపమునను
చిఱుతముత్తెమ్ము లిట్టివి యెఱుఁగ మనిరి.

మౌక్తికాచ్ఛప్రభల్ చూచి మనుజు లెల్ల
స్వాతి తొలివానచినుకెంతస్వచ్ఛ మనిరి
కాని తచ్ఛుక్తిగర్భసంకల్ప మేమొ
ఎఱిఁగినది స్వాతిచినుకొక్కఁడే! శుభాంగి!

౬౪

అస్మదంతరసంభూతమైన కోప
మనెడు వహ్నిక విసరితి నామెమీఁద
ఆమెయును నోర్పుతోఁ గాలిసంత కాలి
ఎంత కటికతనమ్మని యుడిసిపోయె.

కడగి నాయెద నిండి పొంగారు ప్రేమ
పూర మాయమమూర్తిపై ధారపట్టి
క్రుమ్మరించితి నామె నన్ గ్రుచ్చియెత్తి
నిష్కృపయ మెంత చిక్కణనిభృత మనియె.

ఒకమహాసంస్కృతిఫలంబు నొందువేళఁ
దలఁతు నామె నాకాలిసంకెల యటంచు
ఒకమహాసంస్కృతిఫలంబు నొందువేళ
మచ్చిగస్థపూజాకుసుమం బటంచు.

౬౫

కరములందున కరములు కలిపి వైచి
ఇట్టి మా నిర్మ్వరము చెట్టు కట్టినాము
చిగురున గొసాకులో చిన్ని చిన్ని పూలు
కాయలును పిందెలును బూచి కాచినాము.

ఈ తరువునందు జివ్వరులు లేత లేత
పూపమొగ్గలు తావులు బుగులుకొన్న
పువ్వులుగ నన్ను జేసి నీవు తరులగ్న
కంటకాకృతి వైతివి కరుణమూర్తి!

౬౬

నిరత మీకొండయంచుల దొరలివచ్చు
నతిస్రోతల వేగాన నెగురు సీమ
హొంబుశీకరసంతాన మాకసమునఁ
జిఱుతక్రొవ్వానజల్లుతుంపురులవోలె

తుంపురులజల్లులందుఁ ద్విషాంపతిఘృణు
లొలసి కిర్మీరితంబైన వ్యోమసీమ
నైంద్రకార్ముకఖండసహస్ర మొప్పి
చివురు తొడగెను మింట మాఘవతలక్ష్మి.

నీటిజల్లుతుంపురుల పందరులఁగోన
ఇంద్రధనువుల తోరణా లెగురుచున్న
పెండ్లిపందిరి నన్ను భావించుకొనుచు
నాయొడలె నాకుఁ దెలియ దీనాఁటిపగలు.

ప్రతిదినమ్మును సాయంసరాగరమ్య
జలధరచ్ఛాయలందున నిలచియుండి
అగియ నుజీమజీ యనిపించు నామె చేత
నేను నిన్ను ప్రేమించుచున్నా నటంచు.

మాచిఱుతకందుల హాసమ్ముఖోచితంపు
నెలపొమపు రేఁత పలుచవెన్నెల చివుళ్ళ
లోన మాప్రేమ నిశ్చితంబైనయదియ
ఈవిధి దినమ్ము ననిపించు వేల నేను.

ఆపలుకులోన నెప్పటిదో పురాను
భవ మొకండు మనఃపథిఁ బ్రాఁకులాడి
యుదిగదా నన్నిటుల ముక్తిపదముత్రోవ
వెలయఁజేసినదని యనిపించుచుండు.

౭౮

నేను మాయమ్మయొడిలోన నింతవాఁడ
నై నయపుడు నాలోన నీయఖిల మిమిడి
యుండెఁగావలె నేఁటి కి ట్లుబికివచ్చి
చిత్రచిత్రభావాకృతుల్ చెలువుమిగిలె.

పాడుటకు మున్ను కంఠగర్భమున నెలుఁగ
రాక యవ్యక్తమైయున్న రాగమట్లు
నిభృతచిక్కణమూర్తుఁలు నీవు నిసువు
లిన్ని సుఖములు దాఁగినా రెటుల దేవి!

అస్మదీయహృదబ్జనాళాంతరమున
బీజరూపమ్ముగా నుండి విశ్వ మింత
ఇది బహిర్గతమగుదాఁక యెఱుఁగలేన
అంత యవ్యక్తశిశుమూర్తి నైతి నెట్లు ?

౬౯

ఇవి యథాకంఠనిర్గతం బవి తథావి
లిఖితములు ప్రేమగీతముల్ దేవి ! నీయ
పాంగరేఖాచలన్మందహాసవాహి
నీతరంగాల నాదుగుండియ చలించి

ఈవిశాలకృష్ణాతటీవీవిలాస
మృదుశైబలశారదాంబుసంపదలఁ గదలు
లాడు జమిలినావలకు సామ్యము కుదుర్తు
నీప్రశాంతాస్మదుభయమూర్తిప్రథలకు.

ఇది విచిత్రమ్ము నాకు నాకే మదీయ
హృదయమున నన్ను నేఁ బ్రతిష్ఠించుకొనుచు
స్నిగ్ధదేవతామూర్తిని నేన పూజ
చేసికొందు నన్ను వరలక్ష్మీదయితుని.

ఈయనంతప్రయాణమ్ము నేగుచుంటి
నా! ప్రతిమలుపునందు నీవై యిదె కను
మింత దూరమ్ము వచ్చినా వీ వలంచు
జ్ఞాపకము నాకు చేయుచున్నావు దేవి !

ప్రతిమలుపునందునుం జానపదుల బాల
వలె నసంస్కృతములు రాగివైన కేశ
ములును నివ్వెఱవోవు దృక్కులును ధూళి
పిహితదేహమ్ముతోడఁ గన్పించుచుంటి.

కనులఁ బొడిచితి వీయనాగరకజాన
పదకుమారికామూర్తివి ప్రథమమందు
నేను నివ్వెఱవోతి నూహించుకొలఁది
నాకనుగొలంకు నిండుచున్నది జలాన.

ఇది ప్రతినఁ పూనితిని ప్రవాహింపఁజేతు
నీయుడుగుదమ్ములందు ననేకనాక
వాహినులు వానినీగముల్ ప్రాశనమ్ము
గాఁగ భావ్యాంధ్రదేశసత్కవుల కెల్ల.

మధురహైమచ్ఛాభిరామయుచు మదవ
తీరణన్నాపుః క్రేంకృతిప్రశస్త
కూజితయునైన హంసిపైఁ గూరుచుండి
భావిశారదామూర్తిని ప్రజ్వలింతు.

ఆసరస్వతి నిన్ను జిహ్వాగ్రసీమఁ
దాండవింపించినట్టి విధాతృమూర్తి
నన్ను నాసృష్టి నేమి యనంగఁగలరొ
మనశిశువులైన భావిసంపన్నకవులు.

౭౨

అమృతకేశీరవహోనాథుఁడైన యపుడు
నీ చెవుల నూదుచుండు ననేక ప్రేమ
గీతములు నీవు విని యరమూఁతకనులఁ
బ్రతిప్రణయగీతమున కనుమతి యొసఁగెను.

నేను వినుపించుచు నెయుండు నీకనులవి
మొగ్గలనుబోలె నిదురలో మూఁతపడును
ఆప్రణయగీతి యానాఁటి కనుమతింపఁ
బడక మరునాఁటికై యాపఁబడును దేవి !

శరదమలమేఘమగు నాకసంపు సరసి
శాంతమై తేలియాడెడు చందమామఁ
బోలె నేకదృక్కులను నీమోము కనుచుఁ
గనుచు నేను నిదురపోదుఁగావలయును.

'జాపిపావ' రేఖయొకండు వ్రాసినాఁడు
నేను ముక్తాచ్ఛాయామధ్యాహ్న వెలయు
హారివిపిలనాయకమణినంట సితస
రః ప్రదేశలో లేందీవరంబునంట.

అతఁడు మధువాక్కు వగు, పరిహాసకాఁడు
కించిదరుణకపోలము కెలని పుట్టు
మచ్చ నఁట శకస్త్రీకుచమండలమునఁ
గరగుటకు సిగ్గునపు మూచుకొంబు నంట.

హారిమణీందీవరమ్ములు నచ్చమైన
పుట్టుమచ్చయుఁ జూచుకమ్మ.నివి నేనె
ఆశబలవర్ణ వర్ణితమ్మైన దేదో!

౮౪

ఊహాపై నూహ లల్లి నే నొక్కరుండ
నున్నయప్పుడు బంగారుచిన్ని మేడ
బురుజు లొక్కటియా! సర్వమును మహాంధ
కారమున భావవీథిలోఁ గట్టుచుంటి.

ఆవిలాసైకరమ్యసౌధాగ్రసీమఁ
బైడిగొలుసుల యుయ్యాల పట్టిమంచ
మందున సుఖైకతల్పుఁడనై మహాంధ
కారమున సుఖస్వప్నముల్ గాంచుచుంటి.

బహుళజన్మాత్తసంస్కాగభద్రమైన
ఒకవెలుఁగు నాకుగుండెలో నొదిగియుండె
ఆవెలుఁగు సోకి నామేడయంత కరగి
పడతి! నే నింతలో దిశాంబరుఁడ నైతి.

౭౫

ఒక్క యిప్పుడీమేను మహోన్నతంపు
పర్వతమువోలె నిక్కిలి భాస మగుచు
మఱియొకప్పుడు నవకుసుమాంకుసుమ
సదృశమై గాలిపొరలలో జారిపోవు.

అది మహాపర్వతమువోలె నమితభాస
మైన వేళల నాకు భయంబు లేదు
గాలిలోఁ బూవురేకునుబోలె నెగురు
వేళ నాయాత్మ యిది భయావిష్ట మగును.

ఉండి యుండి యే వేళనో ఒక్కమరణ
మనుచు లేక యెదో రుజ యనుచు లేక
కప్పురమువోలె నీమేను కరగిపోయి
చనునో యేనిద్రయో మేలుకొనఁగఁబడక.

౭౬

పలుకరాని జ్యోతిస్సు నాప్రణయమెల్లఁ
గావ్యరూపమ్ముగా నిట్లు కరుగఁబోసి
ప్రళయకాలనిగూఢగర్భమ్మునందు
దీనియాకృతిఁగూర్చి చింతించుచుంటి.

ఈమహాద్వైతభావ మిదింత కుదిరి
కుదురనీయద యేలొ నాహృదయశాంతి
ఈసుకావ్యాకృతిం గుదియించివైచి
దివ్యమగు జ్యోతిగా సమర్థింప నెంతు.

విగతతృష్ణుని నన్నింత వెక్కిరించు
నీమహాతృష్ణ

౭౭

ప్రకృతిసిద్ధమ్ముగా నాకు వర్షఋతువు
సాయంసంధ్యలు నివి మనోజ్ఞమున కెక్కు
నా మనస్సు సమ్మర్దజనమ్ము నెడలి
హృదయకుహారమ్ములో శాంతి వెదకికొనును.

ఉదయసంధ్యలకన్న నాకూహ సేయఁ
గాఁ జరమసంధ్యలే భావగర్భితములు
గాఁ గనంబడు నీమొగిల్ కడల మెరసి
కనకగిరిసానువులఁబోలెఁ గానిపించు.

౭౮

శ్రీమధురమూర్తులును చిరంజీవులైన
యట్టి వత్సలాసౌభద్రు లమృతప్రణయ
వారిరాశిని పుడిసిటఁ బట్టినారు
ఎఱిఁగిన జనమ్ము నిర్వ్యాజయే భజింప.

విభృత మస్మద్ధృదబ్జమ్ము నిండియున్న
ప్రియతేజ మాపుణ్యదంపతులయెడల
సాభిలాషమై వాక్ప్రవాహములు కట్టె
నమృతమయములు స్నిగ్ధభావాలసములు.

అతిపవిత్రమ్మయగు ప్రణయమ్మునెడల
నింత సుస్నిగ్ధుఁడైన న న్నీవు నూత్న
మధురమధుంకటాక్షసంపదలఁ జూచి
నన్ను దివ్యునిఁ జేయుచున్నావు నరుని.

౭౯

మనుష్యునిం జీవవర్ణ కంఠస్వను కల్గి
సత్కృతిని దీర్ఘసూచ్యభావమ్ము కలిగి
పసి కల్యాణిపైఁ బాడఁబడిన తెలుఁగు
పాట యొక్కటి నీసురూపముగ వ్రాసె.

ఈసుకవినైన నాజన్మమెల్ల దేవి!
అచ్చుఁ దెలుఁగుపడఁతి వైనట్టి నిన్ను
మరల నాతేనెపాటగాఁ గరఁగఁబోయఁ
ద్వాత్మదాప్లితమ్ముగ నేను ధారవోతు.

౮౦

నాకు నక్షత్రముల దర్శనంబువలన
నీపవిత్రవిశావేళ నిరిసిపోవె
హృదయపద్మంబు పాపభూయిష్ఠమును తు
ఘాభిభూతమ్ము నాబ్రిను కరయుకొలఁది.

పొలఁతి మనపెండ్లి కట సాక్షిభూతుఁడైన
గార్హపత్యాగ్ని మఱల నాకరమువెంట
నక్షతలచేత హవ్యకవ్యములచేత
నర్చితుఁడు కానెలేద యే మనఁగవలయు.

మూఁడువహ్నులు నర్చితంబులుగఁ బొందఁ
దగినవఁటవె ! సావిత్రివ ర్తంబునందు
మెఱయు తారకాపదముల మేలిస్థితులు

శివజటాకృత్తిశ్యామలచ్ఛవిః దనర్చి
కోనదేరి యీసుస్నిగ్ధకోమలంబు
నవజలదమూర్తి చరమసంధ్యను శిఃస్థ
తరుణశశిరేఖచేఁ బవిత్రం బొనర్చు.

చరమసంధ్యయుఁబలె ఫాలచంద్రరేఖ
నీలజలదకేశప్రసూనజాలమధుర
మూర్తి మత్కులపాలిక ముగ్ధహృదయ
ఈచరమసంధ్య నన్నె యూహించుచుండె.

గిరికుమారుని

రాత్రి

నీవు వేసంగినదిపోలె నిజముస్థ
లాని కేగితి సాగరుంబోని నేను
కల్పితోత్సాహతరంగలఁ గదలి కదలి
మఱలమఱల నాపో నేనె తిరుగంబడుదు.

సాధుజలసరిత్సాగరసంగమమ్ము
పోని మననాఁటికలయికలోని నాదు
నాక్రమణ నీదునొదుగుట యందమైన
యీనిశావేళ నేను నూహించుచుంటి.

శామఘనం పూర్ణిమా యామినీ మనోజ్ఞ
వేళలో నీవు పరచిన వెల్ల సెజ్జ
పైనఁ బడఁకొని నీ చిత్రమైన లోచ
నములతో నిన్నె మనసులోనఁ గనుచుంటి.

ఇంతలో నాపయినఁ బుష్పవృష్టి కురిసె
నవ్యమృదుమల్లికా వాసనాతరంగ
గుమ్మ్మని వచ్చి నాహృదయమ్ము దాఁక
నాచికొన్నది ఘ్రాణేంద్రియప్రవృత్తి.

కనులు తెరచితి నీముగ్ధకరమునుండి
నాపయినఁ బూలు రాలుచున్నవి విముగ్ధ
హృదయుఁడను రాలుచున్న పూ లేరి పొదివి
కొంటిఁ గవుఁగింట ముద్దిడుకొంటిఁ బెదవి.

౮౪

ఇదియు మార్గశీర్షపు శుక్లవిదియ హైమ
శైలతనయాహృదీశ్వరమౌళికృతమ
హాభిషేకశైత్యమ్ముల నపుడె విరియఁ
జల్ల మొదలిడె నీబాలచంద్రరేఖ.

తన్నికటదేశసంస్థైకతారకావి
ముగ్ధమోహనరేఖలో ముడుతలు పడి
నాదృగంతమ్ము కుంచుకున్నది దిగంత
రములయందు వి దేమి శైత్యములు గ్రుక్క.

ఈమహాశీతమునయందు నేమొ నాకు
గళవిలీనస్వరమున గద్గదిక వొడము
నస్మదీయదేహమున రోమాంచ మొదవుఁ
జలితలోచనముల బాష్పములు స్రవించు.

౮౫

మబ్బులఁ జూచి నానాఁడు మరుగు చెంచెఁ
దరుణి చిక్కని శ్యామలాబ్దములతోడ
మబ్బుల మేఘుని మొడలు తేంపప్రభాత
ఘనపరిష్వంగములయ్యెను గాంతి పొందు.

అస్మదీయవినీలదేహమ్ముగూడ
ముత్కలాంగనాబాహుహైమచ్ఛవిసుప
రిష్కృతమయి రమ్యమోహనాకృతి వహించు
నన్ను నవ్వ సిగ్గు పుచ్చుచున్నదియుఁ గూడ.

నాకు శంపాలతాంగి సౌందర్యరాశి
నన్నుఁ జూచి యీశంప సౌందర్యమూర్తి
వనుచు నగి పరిష్వంగించు.

ఓయి ఆషాఢజలదుఁడ! ఓయి!! నీకు
నాకు సామ్యమ్ము కలదు విన్నావఁటయ్య!
నావలెనె నీవును గులాంగననుగుఱించి
ప్రణయసుకుమారగీతముల్ పాడుచుందు.

నీమధురగీతములు విని నేలయందుఁ
బులకలునుబోలెఁ బచ్చనిమొలక లెత్తు
నామధురగీతములను విన్నట్టివారి
ముగ్ధహృదయాలు క్రొంగ్రొత్తమోసు లెత్తు.

నీయుఱుము విప్రలబ్ధ నెలఁతుకలను
గళవళింపించు నట్లె నాకమ్రగీతి
కలును నసధర్ములకు బాధ కలుగఁజేయు
ఓయి! నీవలె నీలదేహుఁడను నేను.

౮౨

నీవు నామనస్సున నిల్చినావు దేవి !
నామనసుగోతులును శారదామనోజ్ఞ
చరణమంజీరకలితరంజత్క్రీడాంక
వలితములు నాప్రణయగీతి పాపు తిరిగి.

నీవు నాగుండెఁ గదలించినావు దేవి !
దేవి ! అత్రత్యులగు సర్వదేవతలును
అనభిహూతములు హావ్యకవ్యములు పొంది
నాయకస్మృతత క్షమించినారు దేవి !

నీవు నామేనఁ బెనవడినావు దేవి !
నాతనూలతపైన మాన్మథవిలాస
చిహ్నములు తోఁచి నాదీర్ఘజీవితమ్ము
మనపరస్పరప్రణయాంకమును వహించు.

తతపురాకృతకర్మానుగతి మదీయ
భాగ్యము వినిర్ణయము చేయు బ్రహ్మముదల
ననుసరించిరి నాదుపిత్రాదు లగ్ని
సాక్షికంబుగ నిన్ను నాచాసఁ జేసి.

అస్మదీయపురాకృతమైన పుణ్య
మింత యని యిట్టి దని నాకు నెఱుఁగబడని
వేళలో నీవు మత్కంఠవిదళనక్రి
యార్ధకల్పితశిల వని యాడుకొంటి.

కర్మసిద్ధాంత మనగతగతిఁ జరించి
నాసుకృత మూర్జిత మ్మన్న జ్ఞాన మొదవి
ఈమహానందక్లుప్తస్వర్ధాము మంజ
లిప్రణీతమందాకిని శ్లేషణింతు.

౮౯

మన్మనోజ్ఞతనూవినిర్మాణకలిత
భూతపంచీకరణవేళ మొగ్గపడిన
సమ్మ్రు కావలెఁ గాక యూహాఘగతున
కంబుమాన కేల నాహృదయంబు కరఁగు.

ఈజలరుకుఁ డింతకును మున్నె యెన్నొ పొందెఁ
గానుకలు మద్గిరాంవీథికలఁ జరించి
ఇతని కార్ద్రుఁడనైన నాహృదయపుటము
వీఁ డెఱుఁగనేమొ మఱిమఱి వెంబడించు.

మున్ను నర్తనశాలాభిముఖుఁడనై మ
హాంధతామిస్రశర్వరియందుఁ గీచ
కుండనయి వీనిలోన లీనుండనైతి
మఱలఁ దనలోనఁ గలుపుకోఁ దరుమఁజొచ్చె.

౯౦

ఈ ప్రణయగీతి మును పల్కరించినంత
నాయెడ మహానురక్తయునాఁ బరువులు
పెట్టి నచ్చెడి దిప్పుడు పిలచి పిలచి
నాగళము సన్నవోవుచున్నదియుఁ గూడ.

మనము నూత్ననూత్నప్రణయాంబునిధులందు
ముగ్ధులము సచేలస్నానములు పొనర్చు
తెజెని బహుధాభిలషితభేదప్రహేణ
మంకు నాగీతి పొంగెడి దబ్ధివోలె.

ఇప్పుడు ప్రశాంతసంసార మిద్దఱమును
నీవు నే నయి నేనును నీవు నై ప
రస్పరహృదంతరాళవిశ్రాంతి పొందు
వేళ నే మయ్యె నాగొంతు పిలచి పిలచి.

౯౧

నీవు తొలినాఁడు నామనోనిభృతవీథి
జన్మజన్మాంతరపునీతసంస్క్రియా ప్ర
ణీత మానందశోకలము నీమనోజ
తేజసంస్పర్శకలిమి వెల్గించినావు.

అవి క్రమక్రమవర్ధితమై దిశాంత
రములు రోదసీకుహర మాక్రమణ చేసి
సాగ నానాగపదత్రివిష్టపము వెరిగి
సైకతాంకాపథములదాఁక పోయి.

ఈయనంతవృద్ధికి విసుగెత్తి తుదకుఁ
గుంచుకొని కుంచుకొని వినిగూఢ మస్మ
దంతరాత్మప్రవిష్టమై యుండె మఱలఁ
దొల్లిఁటానందశోకలమై తొంగలించు.

౯౨

మార్గశీర్షాంతవేళ గుమ్మడులు పూచి
యీయుషఃకన్యకకు నలంకృతులు సేయు
మొఁగమునను లాగికొన్న దీముద్దరాలు
మిహికపుఁ సన్నముత్యాల మేలిముసుఁగు.

నాపువుందోఁటలో లతాంతములు వదలి
కోరదులయందుఁ బూచిన గుమ్మడులనె
విలుకడలు చేసికొని కౌఁగిళులు వదలవు
తేఁట్లజంపతు లింతగాఁ దెల్లవారి.

మంచుదమ్మిన నాపోవు మార్గపార్శ్వ
కమ్రలతికాసతులు నన్నుఁ గౌఁగిలించి
నామొడలు జల్లు మనిపించినవి విలోచ
నార్ధమీలనసౌఖ్యమ్ము లావహించి.

— 3

సగము మేఘావృతమ్మయి సగము హరిణ
లాంఛనమనోజ్ఞశిశిరవిలాసచంద్రి
కావృతమ్మయి యీవ్యోమ మతివ! మనము
కౌఁగిటం గ్రమ్ముకొని యున్నకరణిఁ బోలుచు.

ఈజలదమాల వ్యాపించి యీశశాంక
కలితగగనార్ధభాగమ్ము గ్రమ్మె నేను
ప్రేయసీ! నిన్ను మదురఃపిహితవదన
నాక్రమించుకొన్నట్లుగా నవఘళించు.

దివ్యగంగాధునీపరిదీప్త మంబు
ధరసమాక్రాంతము శశాంకతరుణచంద్రి
కావృత మ్మావియత్పథ మస్మదీయ
ప్రణయచారిత్ర మఖిలమ్ము ప్రతిఫలించు.

౯౮

ఒకమహాగాఢమును శిశిరోజ్జ్వలంబు
నగు నెదో పరిష్వంగమునందు మనల
ప్రాణపంచకయుగళమ్ము వాంఛ సేతు
దేవి! దశధాప్రతున్నంబు కావలె నని.

అప్పు డానిత్యవస్త్వభిన్నాత్మలమయి
వెలఁది! యీనాఁటి మనప్రేమబలముచేత
మనభవిష్యత్ప్రజాసుకుమారహృదయ
ప్రణయచరితముల్ పాలించవలయు ననియు.

౯౭

నీపరిశాంతాచ్ఛవిస్తరంగప్రణయప
యస్సుధారాశిలోపల నస్మదీయ
ముజ్జ్వలప్రేమనౌకయు నున్నచోట
నున్నయట్లుగఁ గదలకయుండె దేవి!

అనియు నిర్వీచి నిర్వాయు నస్మదీయ
నౌక యూయొడ్డు పట్టుకొన్నది సమీర
మొక్కపొర లేదు తెరచాప లూపి యూది
చిన్నిగాలిపొరల్ కదల్చితిని నేను.

బహుప్రయాసమ్ముపడి పరవళ్ళు త్రొక్కి
ని స్తరంగభవత్ప్రేమనీరరాశిఁ
జిన్నరితరంగచ్చాలు సృజించినాను
చిన్ని నానౌక యాయొడ్డు చేరుటకును.

౯౬

లలితశృంగారమధుమాసలక్ష్మివైన
నీవిలాసైకపాదచిహ్నితసుమమ్ము
నాయెడఁద పూవుఁదోఁట యనంతకోటి
గాసుమపరిమళముల శ్లాఘ్యత వహించు.

ఆపువ్వుఁదోఁటను బికమ్మనైన నాసు
మధురపంచమగీతిలో మణగియుంటి
మీపువ్వుఁదోఁటతోఁగూడ నీవు నేను
సకలమైనట్టి యీప్రపంచకముతోడ.

అంను నిని యున్న దనుచు లే దనుచు లేక
యున్న దని యుండి లే దని యిన్ని గతుల
రమ్యమద్గీత మిది పరబ్రహ్మమోలె
నీయతికృపచేత విచారణీయ మయ్యె.

౯౭

నీవయిన నేను పాట లెన్నియో రచించి
యీమృదులవీణమీఁద వాయించుకొనుచు
వాడవాడలఁ దిరుగుచున్నాఁడ నన్ను
నేరునుం బల్కరించినవారు లేరు.

అలసి యీవీణ తలక్రింద నవధరించి
నిదురపోదున ఎండ మండిపడునేని
వీణ యిది నెత్తి కడ్డము పెట్టుకొందు
నాలయు వానలు దీనితో నొడ్డుకొందు.

నీవయిన నిన్నిగీతముల్ విజ్ఞయించి
పలుకు నీవీణ మొండకు వాన కిల్లు
చివికిపోయి యేనాఁటికో శిథిలమైన
నది పలికినట్టి పాట లేమానొ కాని.

౯౮

మనపరస్పరప్రేమసంబంధ మింత
దృఢతరం బౌటకును గత మేమొ యంచుఁ
గారణము లొక్కటొకటిగా నేరి తెచ్చి
తొలుత తొలుతనె కాదని త్రోసిపుత్తు.

పాప మిల్లు నిరాకరింపఁబడికూడ
నాయెడల నిత్యమును బ్రసన్నములెసుమ్ము
నీదుసౌందర్యశీలములిల్ నిసులీవ
తయును నీయిట్టిదగు నగాధంపుప్రేమ.

ఇన్నినాళ్ళకుఁ దెలిసిన దీప్రణయపు
సుదృఢబంధకారణము నాయెద విధేయ
మై పసితనంపునాఁటి పిత్రాజ్ఞ నెంచి
జననియనుమతి గని భక్తివినత మయ్యె.

౯౯

అమృతతరుపల్లవాభిరామార్ద్రమూర్తి!
నీకృపావేశమునఁజేసి నీపదాంబు
జముల మ్రోగిన నాగానజనితరవము
వినఁబడియెఁ బ్రేమవాహినీవీథులందు.

అమితశృంగారరసవీథులందు నీకు
నవవసంతోత్సవంబులే చివురుఁబోడి!
ప్రణయసోపానముల నిలంబడి మదీయ
భావకన్యక నీకు నివాళి పట్టు.

ఈనవమధూదయపువేళ నింతి! నిన్నుఁ
బ్రణయకోమలమాకందపాదపమ్ము
శీతలచ్ఛాయలందు వసింపఁజేసి
ముగ్ధభావప్రసూనాలు పూజ లిత్తు.

౧౦౦

మొగిలుచాటు శరజ్జ్యోత్స్న మొగిఁ బిశంగ
రుచులు వెదజల్లుపథముల విచికిలార్ద్ర
గంధి! వలిపంపు పండు వెంగావిచీర
పై విలోచనాంతాంజనప్రభలు పర్వ.

వచ్చి నీమే నొకేసారి వార్షికాభ్ర
లీనసౌదామనీపింగళిమము నంగు
లీవిలూనజపాపాటలిమము చలద
లీగరున్మహానశ్యామలిమము తన్వి!

నవనవసరస్వతీయమునాభగీర
థాత్మజావేణికాపూతయగు ప్రయాగ
పోలె సత్త్వరజస్తమోభూరిగుణస
నాథశాంకరిపోలె నందగిలె దీవు.

౧౦౧

పడంతి! నీప్రేమదాసుల నడచి నడచి
పూవుల బజారులందునం బోయినట్లు
నవనవపరిమళ త్రసూనవ్యతాను
నోజ్జ్వమూర్తిగ నెంచుకొందును లతాంగి

తరుణి! మన్మనఇంద్రియద్వారమున భ
వత్ప్రవేశవాంఛాలవేశత్ప్రచలిత
మైన నాయాత్మం జొచ్చు నీయమృతవాస
నానిలమ్ములు పోసికొన్నవి పురంధ్రి!

నాసొగసుటెంటం జిన్నిరత్నంపుదీప
మిడికొనినరీతిం బదునుచేయించుకొన్న
నాదుపాలమున సురగంగ బోదె కొదుగు
లీల నాయాత్మ నీవు వెల్గించినావు.

౧౦౨

తుంగగిరిసానువుల మహాదుగ్రితతరంగ
మీగిరికుమారకుని ప్రేమవేగ మదియు
ఆసక్తుల కౌగ్గి నీయందుఁ జేరి
నింత చిఱుచాకలై ప్రవహించె చూడు.

నిలుకడలుపడ్డ యాప్రేమకౌలంకులకును
కెలంకులను బూచె శతపత్ర మలఘుతరము
ముగ్ధరమ్యమ్ము కానుక పుచ్చుకొమ్ము
కోసితెచ్చితి దీని నీకాఱకు నేఁడు.

ఇది సభ క్తిక మర్పిత మిది భవచ్ఛి
రంబునను నీదుమోముపై వ్రాలి దేవి!
శారదాషాలబాలశశాంకరేఖ
వలెఁ జెలంగె నాపూర్వతపస్సుచేత.

౧౦౧

పడఁతి! నీప్రేమదామల నడచి నడచి
పూవుల బజారులందునఁ బోయినట్లు
నవనవపరీమళ త్తనూనవ్యతామ
నోజ్జ్వమూర్తిగ నెంచుకొందును లతాంగి

తరుణి! మన్మనఇంద్రియద్వారమున భ
వత్ప్రవేశవాంఛాలవేనత్ప్రచలిత
మైన నాయాత్మఁ జొచ్చు నీయమృతవాస
నానిలమ్ములు పోసికొన్నవి పురంధ్రి!

నాసొగసుటింటఁ జిన్నిరత్నంపుదీప
మిడికొనినరీతిఁ బదునుచేయించుకొన్న
నాదుపాలమున సురగంగ బోదె కొదుగు
లీల నాయాత్మ నీవు వెల్గించినావు.

౧౦౭

తుంగగిరిసానువుల మహాద్రుతతరంగ
మాగిరికుమారకుని ప్రేమవేగ మదియు
ఆనకట్టల కౌగ్గి నీయందుఁ జేర్చు
నింత చిఱువాకలై ప్రవహించె చూడు.

నిలుకడలుపడ్డ యాప్రేమకొలఁకులకును
కెలఁకులను బూచె శతపత్ర మలఘుతరము
ముగ్ధరమ్యమ్ము కానుక పుచ్చుకొమ్ము
కోసితెచ్చితి దీని నీకొఱకు నేఁడు.

ఇది సభక్తిక మర్పిత మిది భవచ్ఛ
రంబునను నీదుమోముపై వ్రాలి దేవి!
శారదాఫాలబాలశశాంకరేఖ
వలెఁ జెలంగె నాపూర్వతపస్సుచేత,